# బాలశతకము



రచయిత

సాహిత్య విద్యాప్రవీణ, ఆంధ్రభాషాప్రవీణ

ఆలపాటి వెంకటప్పయ్య, బి. ఏ.

962 గోవాడ వెల రు 0–25 న. పై.

చదువులేకున్నను ఆర్థికములగు చిక్కులున్నను మిగుల శ్రమించి
బాధలకోర్చియు కొమరులకు విజ్ఞానము కూర్చుటయే
పరమ లక్ష్యముగా నెన్ని నన్ను ఈ పాటివానినిగ
చేయగల్గిన పూజ్యపితరులగు శ్రీ రమణమ్మ
లక్ష్మీనారాయణుల పాదపద్మములకు భక్తి
పూర్వకముగ సమర్పించుకొను
పద్యకుసుమాంజలి



# ప్రార్థన

శ్రీ శుండాద్యుండరయ శ్రీకరార్త త్రాత
సకలధారి పరంగ సర్వవర్తి
మహితతేజుండాది మధ్యాంత రహితుండు
ప్రభుండు బ్రోచుగాత ప్రతిభం గూర్చి.

# వినతి

సరసకృతుల నొప్పు సంస్కృతాంధ్ర కవుల
మహిమ నెపుడు నెంతు మనసులోన
సర్వకాలమెల్ల జనుల వివేకంబు
గూర్పుకవుల కివియె కోటివినతులయ్య.

మహితవిద్యం గూర్చి మాన్యవిధము దెల్పి
వరవివేకశీలబద్ధుం జేసి
సత్యపథము దెలుపు సద్గురువులనెల్ల
నమలభక్తితోడ నమరం గొలుతు.

# బాలశతకము

## మాతృదేవి

1. ఆత్మజాతచయమె ఆత్మసంపదయంచు
సంతు సౌఖ్యమె తన సౌఖ్యమంచు
తనరు మమతఁ జూపు తల్లి కీడుండునా
విమల వినుతశీల వినుర బాల

2. మాతృదేవి మహిమ మాన్యమై వర్ధిల్లు
మాతృదేవి సహనమం దతుల్య
మాతృభక్తి మనకు మహిమంబు గూర్చురా
విమల వినుతశీల వినుర బాల

3. రోతలెల్లఁ బాపి ప్రేతలన్ దిగమ్రింగి
ఉర్వి రుచులెల్లఁ నొనరఁ జేయు
తల్లి ఋణము దీర్ప తనయుల తరమౌనె
విమల వినుతశీల వినుర బాల

---

ఆత్మజాతచయము = పుత్రులసమూహము, సంతు = సంతానము, తనరు = అతిశయించు, తల్లికీడుండునా = తల్లికిన్ + (ఈడుఁ = సాటి,) విమల వినుతశీల = స్వచ్ఛమైన కొనియాడదగిన నడవడికలవాడా. మాన్యమై = గౌరవింపదగినదై, అతులము = సాటిలేనిది, ఒనర = కలుగ, తరము = శక్యము.

4. ప్రకృతి పురుషజాత రమ్యజగమునందు
మాతయన్న లోకమాత గాదె
మాతృసేవ యెపుడు మరువ దగనిదయ్య
విమల వినుతశీల వినుర బాల

5. మనసు వాక్కు చేత మలినరహితమౌను
ఆత్మజాతశుభము నరయుచుండు మాత
కొమరుహితమె గోరు కొట్టినా తిట్టినా
విమల వినుతశీల వినుర బాల

## పితృ దేవుఁడు

6. సుతులఁ జూచు తండ్రి అతులాదరంబుతో
సుతులఁ జూచి తండ్రి సుఖము నందు
కొమరు వృద్ధి తండ్రి కోరుచుండునుగదా
విమల వినుతశీల వినుర బాల

7. సుతులవృద్ధిఁ గోరు పితలెల్ల పడుచుంద్రు
పడయరాని పాట్లు పుడమి యందు
తండ్రి తనను మీఱు తనయుని వలచురా
విమల వినుతశీల వినుర బాల

---

ప్రకృతి పురుషజాత = ప్రకృతియను స్త్రీకి పురుషుడను దేవు వలన కలిగిన, వలచు = కోరు.

8. ఎండ వానలఁబడి బండచాకిరిచేసి
నిలయ భారమెంతో నేర్పుగాను
సైచుచుండు తండ్రి సాటి యెన్నగలమె
విమల వినుతశీల వినుర బాల

9. కోర్కెలెల్ల దీర్చు కొండంత శ్రద్ధతో
తనయు కార్యదీక్ష తండ్రి పెంచు
పుత్ర యశము గాంచి పూర్ణసౌఖ్యము నందు
విమల వినుతశీల వినుర బాల

10. భక్తి మెచ్చి చక్రి భవ్యవరము లిచ్చు
కాంక్షలెల్ల దీర్చు కల్పశాఖి
కన్నతండ్రి మనకు కన్పట్టు వరదాత
విమల వినుతశీల వినుర బాల

## ఆచార్య దేవుఁడు

11. తల్లి తండ్రి పిదప తనరు గురువరుండు
విద్యలెల్ల మనకు వెలయఁజెప్పి
సాధుసూక్తిఁగూర్చు సచ్ఛీల గురువురా
విమల వినుతశీల వినుర బాల

---

నిలయభారము = గృహభారము, సైచు = ఓర్చు, కల్పశాఖి = కల్పవృక్షము, వరదాత = వరములిచ్చువాడు, సచ్ఛీల గురువు = మంచి శీలముగల గురువు.

12. కన్నులున్న నరుఁడు కాంచు వస్తువులెల్ల
కన్ను కందకున్న కణమునైన
శాస్త్రవిద్యచేత శాస్త్రిచూపించురా
విమల వినుతశీల వినుర బాల

13. విద్యగఱపు మనకు వినతి నిచ్చు గురువు
సాధుశీలమరయ సత్యసూక్తి
మహితశౌర్య మాత్మమహిమను గూర్చురా
విమల వినుతశీల వినుర బాల

14. అజ్ఞజనుల కఖిల విజ్ఞానమునుగూర్చి
విజ్ఞనరులఁజేయు వేదమూర్తి
వస్తు తత్త్వమరసి వాస్తవంబందించు
విమల వినుతశీల వినుర బాల

15. కార్యదీక్షమహిమ కర్తవ్యపాలన,
విద్యఘనత నిల వివేక బలము
బ్రదుకుఫలము ముక్తి పథమొజ్జ దెల్పురా
విమల వినుతశీల వినుర బాల

---

కణము = నలుసు, శాస్త్రి = శాస్త్రమెరిగిన గురువు, వినతి = వినయము, సత్యసూక్తి = సత్యవాక్కు, మహితశౌర్యంబు = గొప్పపరాక్రమము, అజ్ఞజనులు = మూఢులు, విజ్ఞనరులు = తెలిసినవారు, తత్త్వము = నిజరూపము, ముక్తి = మోక్షము, ఒజ్జ = గురువు.

16. గుణములెల్ల గలుగు గురుభక్తి నరులకు
మహితశక్తిఁ గూర్చు మాన్యగురుఁడు
నరుల హితము గోరు గురుల సాటిగలరె
విమల వినుతశీల వినుర బాల

## వంశ, రూప, విద్యా, అర్థ, శీల, వివేకవిశేషములు:

17. మంచి వంగడంబు మనుజవరులకెల్ల
మహిమ కూర్చు, నిచ్చు మాననంబు
పసిడిఁ గెంపుఁగూర్ప పరగ శోభించురా
విమల వినుతశీల వినుర బాల

18. జగతి నరుల రూపసౌందర్య మరయంగ
పరులమనసుల తన వశముచేయు
ఒప్పు రూపమహిమ కోడరా జనులెల్ల
విమల వినుతశీల వినుర బాల

19. విద్య ప్రతిభ నిచ్చు వినయంబు సమకూర్చు
ధన వివేకమతుల తనరఁజేయు
సకల శుభము గూర్చు చదువునకెనలేదు
విమల వినుతశీల వినురబాల

---

వంగడంబు = వంశము, మాననము = సన్మానము, పసిడి = బంగారము, కెంపు = పద్మరాగము, పరగ = ఒప్పుగ, ఓడరా = లొంగరా, ఎన = సాటి, ప్రతిభ = సమయస్ఫూర్తి.

20. కులము రూపు విద్య కూడియుండిన గాని
విత్తహీననరుడు వెతలఁ బొందు
అఖిలమర్థమూల మనుచుండ వినలేదె
విమల వినుతశీల వినురబాల

21. కులము రూపు విద్య కోటిధనము నున్న
శీలమెన్న సర్వమూల మౌను
శీలముడుగు బ్రదుకు చెఱచురా మననెల్ల
విమల వినుతశీల వినుర బాల

22. ధరణి సత్యవాణి ధర్మవర్తనమును
సుగుణజాల మెన్న శోభనిచ్చు
వరవివేకబుద్ధి పరమశుభము గూర్చు
విమల వినుతశీల వినుర బాల

## త్రికరణములు

23. కాయశుద్ధిచేత కలుగు నారోగ్యంబు
సూక్తి శుద్ధిచేత సూనృతంబు
స్వాంతశుద్ధిచేత సౌఖ్యంబులబ్బురా
విమల వినుత శీల వినుర బాల

---

అఖిల మర్థమూలము = సకలజగత్తు ధనమూలము, ఉడుగు = క్ర్శించు, (తగ్గిపోవు.) కాయశుద్ధిచేత = దేహశుభ్రతచేత, సూనృతంబు = సత్యము, స్వాంతశుద్ధిచేత = మనసు నిర్మలముగ నుండుటచేత,

## సుజన, దుర్జన వివేకి పద్ధతి

24. సుజనుఁ డన్య జనులఁ జూచు నాత్మపగిది
అగుట నతడు మోస మందు చుండు
లోకయాత్ర లోని లోపంబు కనుమోయి
విమల వినుతశీల వినుర బాల

25. దుష్టులన్యజనుల ధూర్తులఁగా నెంచ
మాయ నందడెపుడు మాయికుండు
దోషజాల్పసుఖులు దూష్యగతులుగారె
విమల వినుతశీల వినుర బాల

26. విద్యాసార మెఱిఁగి వినయశీల మంది
లోకశాస్త్రరీతి లోతునరసి
వరవివేకమందువాఁడుత్తముండురా
విమల వినుతశీల వినుర బాల

## శత్రువు

27. బాహ్యశత్రు వెపుడు భంగపరుప నెంచి
అదనుకొరకుఁ దాను వెదకుచుండు
పగతుఁ డాత్మరిపుల పతకంబు జెఱచురా
విమల వినుతశీల వినుర బాల

---

ఆత్మ పగిది = తనవలె, ధూర్తులు = మోసకారులు, మాయికుండు = టక్కరి, దోషజ = చెడ్డకార్యముల వలన కలుగు, దూష్యము = దూషింపఁదగినది, బాహ్య = వెలువలి, ప్రతిభ = సమయస్ఫూర్తి, పతకము = పన్నుగడ.

28. పెక్కుమాఱులోడి, చిక్కులోఁ బడికూడ
పదను నరసి, తగిన బలముకూర్చి
ఆత్మధరణి దీక్ష నందినారు గదయ్య
విమల వినుతశీల వినుర బాల

29. అరయ శత్రుశేష మగ్నిశేష మెపుడు
విడువరాదు జగతి విజ్ఞనరుఁడు
భావమందు నిల్పు భార్గవు చాణక్యు
విమల వినుతశీల వినుర బాల

## అంతశ్శత్రువులు

30. ఆత్మ నణగి యుండు నంతర్విరోధులు
వానిబారి తలఁగి వఱలుమయ్య
ఆత్మజయముచేత నఖిలజయము గాంచు
విమల వినుతశీల వినురబాల

31. ఏకపత్నిదీక్ష యెల్ల జనులకొప్పు
నన్యసతుల గోర హాని కలుగు
కామదోషము దశకంఠు హతునిఁజేసె
విమల వినుత శీల వినుర బాల

---

ఆత్మధరణి = తనరాజ్యము, విజ్ఞనరుఁడు = తెలిసినవాడు. భార్గవుడు = పరశురాముడు (శత్రువులను మిగలకుండ చేయుటకు 21మాఱులు దండెత్తి వారిని నాశనము చేసినాఁడు,) చాణక్యుడు = మౌర్య చంద్రగుప్తునికి రాజ్యము కూర్చినవాడు (చాణక్యుడు పొరపాటున తనకాలిక్రిందబడి నచ్చిన గుండ్లచెట్టును పెరికి మొదలంట నాశనముచేసెనట,) అంతర్విరోధులు = లోపలి శత్రువులు, బారి = హింస, తలఁగి = తొలగించుకొని,

32. క్రోధమున్న నరుడు కోల్పోవు సహనంబు
క్రుద్ధనరుడు ధర్మబద్ధుఁడగునె
కోపమున్న యెడల శాపంపుఫలమబ్బు
విమల వినుతశీల వినుర బాల

33. లోభిమానవులకు లోపించు సంతృప్తి
తృప్తి లేని నరుఁడె సుప్తినుడుగు
లోభికెపుడు దుఃఖలోపంబులేదురా
విమల వినుతశీల వినుర బాల

34. మోహినరుని తెలివి మూఢమై యొప్పును
ఉర్వి మోహి కన్నులున్న గ్రుడ్డి
మోహమున్న జనుఁడు ముక్తిఁగాంచఁడు గ
విమల వినుతశీల వినురబాల

35. మదము గల్గు జనుఁడు మరచును పరమాత్మ
మదముచేత నతఁడు మహిమ నుడుగు
మదము జనులకుండ మాఱుతుండేలరా
విమల వినుతశీల వినుర బాల

---

లోభి = పిసినిగొట్టు, సుప్తి = గాఢమైనమంచి నిద్ర,
అజ్ఞానము, మారుతుండు = శత్రువు.

36. మహి ననల సమంబు మాత్సర్యమది యెంచ
మాన్యవృద్ధికేడ్పు మత్సరుండు
మచ్చరంబు గల్గ మనసు సంతప్తమౌ
విమల వినుతశీల వినుర బాల

37. ఆత్మలోని రిపుల నరసిచూడ వలయు
అరివిజేత గాదె ఆత్మవిజయి
ఆత్మజేతయనఁగ అఖిలలోకవరుఁడు
విమల వినుతశీల వినుర బాల

## విద్యా, ధన, శీల తారతమ్యము

38. విద్య యున్నవాఁడు వెలయించు తనుదాన
ధనికుఁడన్ని విలుచు ధరణిలోన
శీలవంతుఁ డఖిల జీవుల మేల్బంతి
విమల వినుతశీల వినుర బాల

39. అర్థవంతుఁడందు నలఘుకీర్తి జగతి
అలఘుతరయశంబు నఖిలవేది
అలఘుతమయశంబు నమలశీలుఁడు పొందు
విమల వినుతశీల వినుర బాల

---

మాత్సర్యము = మచ్చరము, సంతప్తమౌ = తపింపఁబడినది, రిపుల = శత్రువుల అరివిజేత = శత్రువులజయించినవాడు, ఆత్మవిజయి = తనను తాను జయించినవాడు, వెలయించు = ప్రకాశింపఁ జేయును, విలుచు = కొనును, అలఘు = గొప్ప, అలఘుతర = పైదానికంటె గొప్ప, అఖిలవేది = సమస్తము తెలిసినవాఁడు, అలఘుతమ = సర్వోత్తమమైన, అమలశీలుడు = స్వచ్ఛమైన స్వభావము గలవాడు.

## మానవుల అల్పత్వము, అనిత్యత

40. పుడమి జీవులెన్నొ పుట్టి గిట్టుచునుండ
మానవుండు మిగుల మహిమఁగాంచె
సర్వశక్తియుక్తి సర్వంబు తానౌనె
విమల వినుతశీల వినుర బాల

41. అరయ విత్తవంతు నర్థంబు నశియించు
అఖిలవేది నరుఁడు నంతరించు
మహితరాజులైన మహి లీనమౌదురు
విమల వినుతశీల వినుర బాల

## తర్క, వేదాంత, విజ్ఞానశాస్త్రములు-వాని సారాంశము

42. తర్కశాస్త్రమందు దైవమనుమితంబు
వేదశాస్త్రమందు వెలయునంత
భౌతికంబునందు పరశక్తిలేదురా
విమల వినుతశీల వినురబాల

43. బ్రహ్మ సత్యమయ్యు పరఁగు జగన్మిథ్య
అనుచు నాదిశాస్త్రులరసి యనఁగ

---

గిట్టుచు = చచ్చుచు, సర్వశక్తియుక్తి = సరశక్తులుండుటచే విత్తవంతు నర్థంబు = ధనవంతునిడబ్బు, అంతమందు = నశించును, మహి = భూమిలో, దైవము = దేవభావము అనుమితంబు = అనుమానముగ జెప్పబడినది అంత = అంతట, భౌతికంబు = భౌతిక శాస్త్రము, పరశక్తి = పరబ్రహ్మము, జగన్మిథ్య = లోకముఅసత్యము, ఆదిశాస్త్రులు = పూర్వశాస్త్రజ్ఞులు, భాను = సూర్యుడు,

భానుమూలకంబు భౌతికంబయ్యెరా
విమల వినుతశీల వినుర బాల

44. ఇలను శాస్త్రశక్తినెంచి చూచుచునుండ
భౌతికంబె వాస్తవంబు ననుచు
జనుల భావమదియు జాగృతంబాయెరా
విమల వినుతశీల వినురబాల

45. విజ్ఞుఁడిచ్చెనొకఁడు విద్యుత్తు వరశక్తి
బుద్ధిశాలి గూర్చె పొగలబండి
అరసిశాస్త్రిగాంచె నాకాశవాణిని
విమల వినుతశీల వినుర బాల

46. దూరదృష్టి నమర దూరశ్రవణయంత్ర
మాకస మరసింపు యాన విజ్ఞు
లందఁజేసిరయ్య యతుల సాధనములు
విమల వినుతశీల వినుర బాల

47. అరయ నచ్చుయంత్ర మమరె శాస్త్రజ్ఞుచే
అన్యుఁడొక్కఁడు గడియార మిచ్చె
సిద్ధమయ్యె నొకనిచే జలాంతర్గామి
విమల వినుతశీల వినుర బాల

---

జాగృతంబు = మేల్కొన్నది, (కనుల దెఱచినది.) ఆకాశవాణి = రేడియో, దూరదృష్టి = దూరదర్శిని యంత్రము, దూరశ్రవణ యంత్రము = టెలిఫోను, జలాంతర్గామి = నీటిలోపల నేపోవు నావ.

కృత్రిమగ్రహముల కీలొల్పె నొకరుండు
ధరణి చుట్టి వచ్చె నరవరుండు
చంద్రుఁజేరు శక్తి సాధింప బడుచుండె
విమల వినుతశీల వినుర బాల

భౌతికమున సవిత వస్తుబలము కొఁగ
హైందవమున బ్రహ్మ యఖిలగతము
నిచ్చలు రవి కుంద నిత్యుఁడా పరమాత్మ
విమల వినుతశీల వినుర బాల

అణుచయంబు వస్తువని తెల్పినారయ్య
అణువు శక్తిమహిమ యద్భుతంబు
అణువు శక్తి చిక్కనఖిలంబు వశమంద్రు
విమల వినుతశీల వినుర బాల

అణువుకంటె నణువు నధికు కంటె నధికుఁ
డరయ రూపు నామ మందకుండు
ఆదిమధ్యరహితుఁ డక్షరుండాబ్రహ్మ
విమల వినుతశీల వినుర బాల

---

కొల్పె = పొసగించె, (కనిపెట్టెనని భావము.) హైందవమ మతమున. బ్రహ్మ = పరబ్రహ్మ, అఖిలము = సమస్తము, నిప్రడు, కుంద = క్షీణింప, (సూర్యుడు దినదినము కొన్నిట గ్గిపోవునని శాస్త్రజ్ఞవచనము.) అక్షరుడు = నశింపనివాడ

52. అరయ నుండు నిందునందు లేడను బుద్ధి
వలదు నీకు జగతి వలఁతికాఁడ
అంతబ్రహ్మశక్తి యంతర్గతంబురా
విమల వినుతశీల వినుర బాల

## మతాదుల భేదదృష్టి-అందలి గుణదోషములు

53. మతములన్ని అరయ మహిని దేవునె చెప్పు
మహితశక్తుఁడతఁడు మతములందు
మూలశక్తి నమ్మి మూఢతన్ వీడరా
విమల వినుతశీల వినుర బాల

54. పుట్టుభేదమరుదు పట్టుభేదమె కాని
గిట్టుభేదమున్నె గుట్టునరయ
పుట్ట గిట్టలేని పొరపది యేలరా
విమల వినుతశీల వినుర బాల

55. వెఱపు నిద్ర భుక్తి వెలయు దాంపత్యంబు
జనులకెల్ల సమము జగతియందు
జాతిభేదమెన్ని జనహత్య లేలరా
విమల వినుతశీల వినుర బాల

---

వలఁతికాఁడ = నేర్పుకలవాఁడ, అంత = అంతటను, అంతర్గతము లీనమై యుండునది, పట్టుభేదము = కల్పించుకొనిన భేదము, పొరపు భేదము, వెఱపు = భయము.

56. ‘అల్ల’ ‘తండ్రి’ ఈశ్వరాదిదేవు లరయ
సర్వమూల నిత్యశక్తులంద్రు
మమత నమ్మువారె మతవాదు లెంచగా
విమల వినుతశీల వినుర బాల

57. మతములన్ని చూపు మహితుఁజేరు పథము
కామ్యవృత్తి నరుల కార్యబోధ
పదవిభేదముండు ప్రాప్యభేదమరుదు
విమల వినుతశీల వినుర బాల

58. దైవభక్తులన్న దమశమ శీలురు
నమిత విజ్ఞ నరులు నంద్రుగాదె
వారె మచ్చరంబు వహియించుటేలనో
విమల వినుతశీల వినుర బాల

59. ప్రాంత - దేశ - ఖండ - జాతి - వర్ణ - మతాల
కార్మికాన్య - కర్షకాన్యరీతి
భిన్నులగుచు నరులు ఖిన్నులగుట యేల
విమల వినుతశీల వినుర బాల

---

మమతన్ = అభిమానముతో, కామ్యవృత్తి = కోరదగిన ప్రస
నము, పదవి-భేదము = మార్గభేదము, దమము = ఇంద్రియనిగ్రహ
శమము = కామక్రోధాదులు లేకపోవుటచే గలుగుశాంతి, ఖిన్నులు.
దుఃఖము గలవారు.

60. షియలు సున్నిలనుచు శిష్టులన్యులనుచు
కాథలిక్తదన్య కాములనుచు
బ్రాహ్మణాదులనుచు బాహ్యభేదములేల
విమల వినుతశీల వినుర బాల

61. వర్ణ-జాతి" రంగు" వర్గ-మతాదులఁ
గలుగు భేదమరయ కల్పితంబ
వాని భేదమరయువారె మూఢులు గదా
విమల వినుతశీల వినుర బాల

## ధన్యజీవి

62. జగతిలోన నరయ సర్వమానవులందు
మాన్యచరితుఁడౌను ధన్యజీవి
అతఁడనిత్యుఁడయ్యు నందు నిత్యయశము
విమల వినుతశీల వినుర బాల

ధన్యజీవి యెపుడు తాను గోరు యశము
దానికంటె నిత్యమైనదేది
నిత్యమౌట కల్ల నిఖిలవస్తువులెల్ల
విమల వినుతశీల వినుర బాల

---

శిష్టులు = సదాచార సంపన్నులు, కాథలిక్ + తదన్యకాములు కాథలిక్కులు, వారికంటె ఇతరమగు కోరికలు గలవారు. (లూథరనుల

ధన్యజీవి = కృతార్థమైన జీవితము గలవాడు.

## ప్రజా స్వామికము - నియంతృత్వము

64. "పదుగురెంచు బిల్లు" పాటియై ప్రజలెంచ
పాలనంబు సాగు పట్టుగాను
ప్రజ్ఞ నొకని సూక్తి పాటింపఁ బడదయ్యె
విమల వినుతశీల వినుర బాల

65. ప్రజలు తమకు నచ్చు ప్రాజ్ఞునెన్ను కొనఁగ
దేశమేలు నతఁడు తేజరిల్ల
ప్రజలకు ప్రజలెంచ ప్రజలేలు రాజ్యంబు
విమల వినుతశీల వినుర బాల

66. ప్రాతినిధ్యమందు ప్రజ్ఞు లెల్లరుఁ గూడి
చర్చ సలిపి చేయ చట్టమమర
ప్రజల పాలనంబు పరఁగ సాగుచునుండు
విమల వినుతశీల వినుర బాల

67. ప్రజలు విజ్ఞులైన, ప్రాజ్ఞప్రతినిధుల
నెన్నుకొనఁగ, వారు చెన్ను మీఱ
శుభదపథము నెంచి శోభింపఁ బాలింత్రు
విమల వినుతశీల వినుర బాల

---

పాటి = ప్రమాణము - న్యాయమైనది. పట్టుగా = పట్టుదలగా, తేజరిల్లు = ప్రకాశించు, చెన్నుమీఱ = అందమతిశయింపగ, శుభద పథము = మేలుగూర్చు మార్గము.

68. అజ్ఞులైన జనులు ప్రజ్ఞలేని నరుల
ప్రాతినిధ్యమిచ్చి పంపఁ గాను
సర్వజనుల మేలు సమకూర్చు టెట్లురా
విమల వినుతశీల వినుర బాల

69. నాడు నాడులందు నిండు ప్రజాస్వామ్య
మమరి ప్రజలు వృద్ధి నందు చుండ
పార తంత్ర్య ముక్తులై రపరజనులు
విమల వినుతశీల వినుర బాల

70. హక్కుఁగోరు నరుఁడు పెక్కు బాధ్యతలంది
ఆత్మదేశవృద్ధి యతిశయింప
దేశభక్తితోడ దేశంబు నేలురా
విమల వినుతశీల వినుర బాల

71. ప్రజల ప్రతినిధులును ప్రజల సేమము వీడ
పదవి కాంక్ష పెరిగి పదుగురుండ
ప్రజల పాలనంబు ప్రజల నెటులఁబ్రోచు
విమల వినుతశీల వినుర బాల

---

నాడు = దేశము, పార తంత్ర్యముక్తులు = పరతంత్రదశనుండి విముక్తి పొందినవారు, సేమము = క్షేమము.

72. జనుల మేలు కూర్ప శాసనసభలుంట
ప్రజల పాలనంపు పరమపథము
శాసనంబు ఫలము సర్వసంగత మౌను
విమల వినుతశీల వినుర బాల

73. అపరి పక్వబుద్ధి అన్యాయకారంబు
పదవికాంక్ష పక్షపాతగుణము
లంచగొండి తనము నెంచ మేలు చెఱచు
విమల వినుతశీల వినుర బాల

74. రాజ్యమేలు పథమరయ నొకనికిఁ జిక్క-
నతఁడె ధర నియంత యగుచునుండు
అట్టి యధిపుఁడేలు నాత్మేచ్ఛ దేశంబు
విమల వినుతశీల వినుర బాల

75. స్వేచ్ఛ దేశమేలు వీరపాలకుఁడును
అఖిల శుభము గూర్తునను, కాని
వాని మాటకెదురు వచనంబు లేదురా
విమల వినుతశీల వినుర బాల

---

సర్వసంగతము = అందరికిని వర్తించునది, అపరిపక్వబుద్ధి = పరిణితము కానిబుద్ధి; నియంత = రాజ్యముపై సర్వాధికారముగల పాలకుడు; ఆత్మ + ఇచ్ఛ = తన యిష్టప్రకారముగ.

76. ప్రజల వాణి నతఁడు పాటింపఁ బూనఁడు
వాని మాట వేదవచనమనును
దీక్షఁ జెప్పఁ బూన శిక్షించి చెఱఁ బెట్టు
విమల వినుతశీల వినుర బాల

77. ధర నియంత తాను పరుల నమ్మఁ డెపుడు
నమ్మ నతఁడు సేన నెమ్మితోడ
సేన విడిచి యతఁడు సేమంబుఁ గానఁడు
విమల వినుతశీల వినుర బాల

78. అతఁడు పూను కార్య మదియెల్ల రూపొంద
వేగమార్గమంది సాగుచుండు
కార్యహానిఁ దెల్పు కాలంబె యరుదురా
విమల వినుతశీల వినుర బాల

79. సరిగఁ బాలనమది సాగించి కొందఱు
దేశహితమె కోరి దీక్షఁబూని
పెంపు చేయఁ జూచి పెరలెంతొ పొగడిరి
విమల వినుతశీల వినుర బాల

---

నెమ్మి = నిండుమనస్సు, పెఱలు = ఇతరులు,

నేత సుజనుఁడైన నిత్య సౌఖ్యములబ్బు
చెనఁటి యైన నేమి చెప్పఁ గలము
ఎంచ క్రూరుఁడైన నికనేమి బ్రదుకురా
విమల వినుతశీల వినుర బాల

మానవాళి యమిత మమతఁ జూపుచునుండు
వాద పథములెన్నొ వసుధఁగలవు
వాదమహిమ దెలుపు భావికాలము సుమ్మి
విమల వినుతశీల వినుర బాల

ఆత్మజేత జయమునందు కుటుంబాన
ఇంట గెలిచి రచ్చ నితఁడు గెలుచు
గ్రామ కార్యమెలయఁ గావించు నేర్పుతో
విమల వినుతశీల వినుర బాల

గ్రామ జేతకబ్బుగా మండల జయంబు
మండలంబు నేలి మాన్యుఁడగును
జనుల సుఖము గూర్చు మొనగాఁడె నేతరా
విమల వినుతశీల వినుర బాల

నేత = నాయకుండు, చెనఁటి = దుష్టుఁడు, ఎంచన్ = గణి
ఁచన్ = పొందగ.

84. రాష్ట్రనేత యైన రాష్ట్రజనులఁ బ్రోచు
జనుల యాదరంబు జాణ పొందు
జాణ యైన వాఁడె జాతినేలును గదా
విమల వినుతశీల వినుర బాల

85. చాగి యయ్యు నఖిల జనహృన్నివాసియై
సకల జనులు నాత్మ సమ్మతింప
దేశనేత జాతి దీక్షతోఁ బాలించు
విమల వినుతశీల వినుర బాల

86. దేశజనులనేత దేశవృద్ధికిఁ బూను
దేశరక్ష సేయు దీక్షతోడ
దేశభక్తితోడ దేశంబు నేలురా
విమల వినుతశీల వినుర బాల

87. ప్రజల నాయకుండు ప్రజల నాకర్షించు
ప్రజల దేశభక్తిఁ బరఁగఁ బెంచు
దేశహితముఁ గోరి దీక్షఁ బూనుచు నుండు
విమల వినుతశీల వినుర బాల

---

జాణ = నేర్పరి, చాగి = త్యాగి, అఖిల జనహృత్ + నివాసి
సమస్తజనుల హృదయములలో నివసించువాడు.

88. ప్రజల హితము తనకుఁ బ్రథమ లక్ష్యంబను
ప్రజల కొరకు తాను ప్రాణమిచ్చు
ప్రజల నాయకుండు ప్రజల సేవకుఁడయ్యు
విమల వినుతశీల వినుర బాల

89. పూజ్యనేత నిలను బూజింత్రు ప్రజలెల్ల
నతఁడు గోర ప్రాణమప్పగింత్రు
రాజుఁ బట్టి జనులు రాణింత్రు జగతిలో
విమల వినుతశీల వినుర బాల

90. స్వార్థదృష్టి విడిచి సౌభ్రాత్రమది నిల్పి
చింత సేయుచుండు సేవకొఱకె
మనుజసేవ నెంచు మాధవసేవఁగా
విమల వినుతశీల వినుర బాల

91. దేశసీమ దాటి దేశదేశాలేగు
వసుధ జనులఁ గోరు వాసి గాంచ
సర్వ జనులసమత సాధింపఁ బూనురా
విమల వినుతశీల వినుర బాల

---

స్వార్థదృష్టి = తన ప్రయోజనమునందేయుండు చూపు, సౌభ్రాత్రము = సోదర భావము, సీమ = హద్దు, వాసి = ప్రసిద్ధి.

92, జనుల భావమరయు జాతిమతము వీడి
జనుల లక్ష్యమెన్ను సత్యదృష్టి
అఖిల సుఖము గోరు నాదర్శ జీవియై
విమల వినుతశీల వినుర బాల

93. ఒకరి నొకరు నమ్మి యొండొరు మేల్గోరి
లాభదృష్టి వీడి లగ్గు దలఁచి
అన్యదేశవృద్ధి నాత్మవృద్ధిగఁ జూచు
విమల వినుతశీల వినుర బాల

94. విశ్వదృష్టి కలుగ విశ్వజనుల కెల్ల
నేత పూనవలెను నేర్పు గాను
నేతలందఱి కిది నిత్య కార్యంబురా
విమల వినుతశీల వినుర బాల

## సుగుణములు

95. జగతి దానగుణమె జనుల నాకర్షించు
సదయశీలమిచ్చు సంతసంబు
త్యాగబుద్ధి పరమ హర్షంబుఁ గూర్చురా
విమల వినుతశీల వినుర బాల

---

విశ్వదృష్టి = విశ్వమానవులు సోదరులను చూపు, పరమహర్షము = గొప్ప సంతోషము.

96. సామదానములిల సర్వశుభములిచ్చు
వినయశీల మదియు వెలయఁ జేయు
పరుల మేలు సేయఁ బరమ పుణ్యము నబ్బు
విమల వినుతశీల వినుర బాల

## ప్రాణి ప్రపంచము

97. జీవకోటులన్ని జీవించు జగతిలో
ప్రకృతి సిద్ధభుక్తి నంది కాదె
వాసి పోదె నరుఁడు వంచింప భుక్తికై
విమల వినుతశీల వినుర బాల

98. జీవకోటిలోని జీవమన్య మొకటి
వసన ధారి గాదు వసుధ యందు
నరుని వసన ధారణమహిమ గనుమోయి
విమల వినుతశీల వినుర బాల

99. కోటి జీవులుండ కొలది సంపదచేత
కొన్నిప్రాణు లదియు కొఱల కుండ
విత్తమున్న నరుఁడు వెలితి గాంచుట యేల
విమల వినుతశీల వినుర బాల

---

వెలయ = ప్రకాశింపఁ, వాసి = ప్రసిద్ధి, వంచింపన్ = మోస
గింపగా, కొఱలక + ఉండ = పొందక-ఉండ.

## విజ్ఞుల కర్తవ్యము

100. ప్రాణి మూలమరసి భావభేదము వీడి
లోక భావమెఱిఁగి లౌకికుండు
విత్తసక్తి విడక వెలుగు పథమె లేదు
విమల వినుతశీల వినుర బాల

101. జగతి విజ్ఞనరుఁడు సత్యసంధతఁ గాంచి
శుద్ధశీలమంది వృద్ధుఁడయ్యు
మంచి పనులుచేసి మహిత యశమునందు
విమల వినుతశీల వినుర బాల

102. భుక్తమరుగు నరయ పుట్టంబు చిరుగును
పుట్టు జీవి గిట్టు పట్టు కొన్న
శాశ్వతంపు కీర్తి సాధింపఁ బూనురా
విమల వినుతశీల వినుర బాల

## పురుషార్థములు - తత్సాధనము

103. నరుని చేష్టలెపుడు నాణెంబు చెడకుండ
రాజ, సంఘ ధర్మ రక్తినంద
అతఁడు ధరణి వెలయు నంచిత ధర్మాన
విమల వినుతశీల వినుర బాల

---

విత్తసక్తి = ధనమందాసక్తి, శుద్ధశీలము = పవిత్రమైన నడవడి, భుక్తము = భుజింపబడినది, (ఆహారాదికము.) పుట్టము = వస్త్రము, నాణెము = ఇచ్చిపుచ్చుకొనుటయందలి యోగ్యత, రాజ-సంఘధర్మ రక్తిన్ = రాజధర్మములందును, సంఘ ధర్మములందును ఉండుఆసక్తితో, అంచితధర్మాన్ = ఒప్పుచున్న ధర్మముతో.

104. అర్థ మూలమైన ఆసక్తజనములో
విత్తవంతుఁడయ్యు వెలయ వలయు
ధర్మ బద్ధ సంచి తార్థంబె రాణించు
విమల వినుతశీల వినురబాల

105. ప్రకృతి బద్ధులయ్యు పరఁగ మనుజులెల్ల
కాంక్ష వీడి సలుపఁ గలరె తపము
ధర్మ బద్ధ కాంక్ష ధరణి శోభించు రా
విమల వినుతశీల వినుర బాల

106. పరఁగ నిహామునందు పురు షార్థముల మూటి
నెవ్వఁ డాచరించు నెపుడునర్థి
పరమునందు మోక్షఫలమునందు నతఁడె
విమల వినుతశీల వినురబాల

---

ఆసక్తజనము = అపేక్షతో గూడిన జనులు, ధర్మబద్ధసంచితార్థము = ధర్మప్రకారము సంపాదింపబడినసొమ్ము, ప్రకృతిబద్ధులు = ప్రకృతిచే బంధింపబడువారు, ధర్మబద్ధకాంక్ష = ధర్మముతో కూడిన కోరిక, ఇహాము = ఈలోకము, అర్థిన్ = కోరికతో, పరము = పరలోకము.

# గ మ ని క

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 4 | 10 | గూర్చు కపుల | గూర్చు కవులు |
| 5 | 18 | అతులము | అతుల్య |
| 12 | 24 | అంతర్వ్యారోజ్ఞులు | అంతర్వ్యారోధులు |
| 13 | 19 | మారుతుండు | మాఱుతుండు |
| 14 | 19 | సంతప్తమా | సంతప్తము |
| 16 | 13 | మాకసమరసింపు యాన విజ్ఞు | మాకసంపుయాన మరసి విజ్ఞు |

జ్యోతి ప్రెస్, తెనాలి.

అక్టోబరు 1962 కాపీలు 2000